2-15.

# పరితప్త సుయోధనుడు

# అశ్వత్థామ

(ఏకపాత్రాభినయములు)





గ్రంథకర్త :

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత

సంస్కృతాంధ్ర పండిత

మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము

ప్రథమ ముద్రణము : వేయిప్రతులు

ఆనంద వసంతము

1974



*For Copies :*

**Bandla Subrahmanyam,**
PANDIT.
VETAPALEM. Chirala Taluk.
( Prakasam Dt. )

నా రచనల నాదరించి, సాహిత్యసేవయందుల్లాసము గలిగించుచున్న ఆంధ్రలోకమునకు నా కృతజ్ఞత.

— గ్రంథకర్త.

మూల్యము రు. 1-50

---

గమనిక :— పోటీలకు పోవువారు వారికిచ్చిన కాలమునుబట్టి తగ్గించుకొని నటింపవచ్చు.

# తొలిపలుకు

ఇప్పటికి నా రచించిన నాల్గేకపాత్రాభినయములలోఁ దొలుదొల్త వ్రాసినవి పరితప్త సుయోధనుఁడు, మయసభ. ఇది సుమారిరువది శరత్తులనాఁటి సంగతి. 'ద్రౌపదీ వస్త్రాపహరణం' నాటకమున నేను 'దుర్యోధన' పాత్ర నిర్వహించుచున్న తరుణమది. ఆ భూమిక నాకత్యంతాభినివేశముంటంజేసి నాకొఱక నేనియ్యవి వ్రాసికొని నటించితి. పిదప డాక్టర్: సిహెచ్. అమరలింగముగారు నేర్చుకొని యనేక పరిదేశములఁ బ్రదర్శించిరి. నాఁటంగోలె మన్మిత్రచ్ఛాత్ర ప్రభృతులు పెక్కు విడుతల పలుతావులఁ బ్రదర్శించి ప్రశంసలనందుకొని పోటీలకుం జని విజయము గడించి రజతపాత్రలు, పతకములు పారితోషికములుఁగ నందిరి. ఇతర జిల్లాల నుండి వచ్చి వ్రాసికొనిపోయి నటించినవారును గలరు. పెక్కురు ప్రోత్సహించిన నివి యిందనక నచ్చొత్తింపఁబడకుండుటకుం గారణము నా యుపేక్షయే. దానిహేతువు నే నాంధ్ర మహాభ్యుదయ రచనా నిమగ్నుండనై యుంట

ఇది యిట్లుండ రెండుమూఁడు వత్సరములనుండి బుద్ధిమంతులు మద్ధితులు సుపరిచితులు "వీరాధివీరుఁడగు మహారథి కర్ణుని చరిత్ర నేకపాత్రాభినయముగను, నాటకముగను వ్రాయుఁడు. అమ్మహాదాతకీయందగు ప్రాధాన్యతనిచ్చి న్యాయ్యము చేకూర్పు"ఁడని పలుచోట్ల నన్నుంగోరిరి. అందు ముఖ్యముగ నెన్నందగినవారు డాక్టర్: భట్టకోట సుబ్బారాయుఁడుగారి జ్యేష్ఠ పుత్రుఁడు డాక్టర్: భట్ట వరప్రసాదరావుగారు. కావునఁ గాలహరణమిఁక ననపేక్షణీయమని వెంటనే రచింప నా బాల్యమిత్రుఁడు నేను వస్త్రాపహరణమున దుర్యోధనుఁడుగ నటించుచుండ నాతోఁబాటు శిశుపాల పాత్ర నిర్వహించినవారును కీలుగుఱ్ఱము, రత్నరేఖ, రుక్మాంగద, కాళిదాసు, వరకట్నము మొదలగు చిత్రములలో నటించిన శ్రీ బొక్కసము ఆదిశేషయ్యనాయుఁడుగారు నేర్చుకొని యీనెలలోని మూఁడునాళ్లు చోట్లఁ బ్రదర్శించితి

రెండు రెండేకపాత్రాభినయములొక్కొక్క పొత్తముగ నేర్పఱచిన నన్నింటికనుకూలముగ నుండునని కళాభిమానులు గొం

డను సలహాలీగా నేను నయ్యదియు మంచిదని భావించుటంజేసి (1) మయసభ, మహారథి కర్ణుఁడు ఒకపుస్తకముగను, (2) పరితప్త సుయోధనుఁడు, అశ్వత్థామ యొకగ్రంథముగను ముద్రితములయ్యె. గదాయుద్ధ ధర్మదూరుఁడైన భీమునిచే దుర్యోధనుఁడు తొడలు విఱుగఁగొట్టబడి పడియుంటం గన్న యశ్వత్థామ యెనస్సెట్టి పరివ ర్తనము నొందెనో యెట్లు పగతీర్చుకొని స్వామిఋణమీఁగెనో చిత్రింపఁదలఁచి యశ్వత్థామ యను నేకపాత్రాభినయము రచించితి. భక్తప్రహ్లాద, కుమార విజయము (పద్మాసుర), బుద్ధావతారము, భక్త తులసీదాసను నాల్గు నాటకములు మత్కృతము లాంధ్రదేశమునఁ బ్రదర్శింపఁబడుచుండ నిప్పుడు నాల్గేకపాత్రాభినయములు లోకమున కందిచ్చి యానందించుచున్నాఁడ.

అస్మద్గ్రంథ ముద్రణమునకు సహాకరించుచున్న శ్రీ కె. సాంబిరెడ్డి, B. A., S. E. O. గారికి, శ్రమయునక మద్రాసునుండి ఫొటోబ్లాకులు చేయించి పంపిన శ్రీ పింజల వేంకటేశ్వర్లు (Hand - Loom Cloth Merchant, Madras) గారికి, ముచ్చటగ నచ్చొత్తించి యిచ్చిన శ్రీ జయలక్ష్మి ప్రింటర్సు, చీరాలవారికి నాకృతజ్ఞతం దెల్పుచున్నాఁడ.

— గ్రంథకర్త.

## హెచ్చరిక

నా లిఖిత పూర్వకమైన యనుమతిపత్రము లేనిదే యీ యేకపాత్రాభినయములను ప్రదర్శించుటగాని, రికార్డింగు చేయుటగాని, రేడియో బ్రాడ్ కాస్టు చేయుటగాని, సినిమా తీయుటగాని, మాటలు మార్చుటగాని చేయరాదు ఇందుకు వ్యతిరేకించి ప్రవర్తించు నటులు, నిర్వాహకులు, మ్యూజిక్ స్టాఫ్ వారు, ఆర్గనైజర్సు ఇంకను సంబంధించిన ఇతరులు నాచేజరుపఁబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యు లగుదురని ఇందుమూలముగఁ దెలియజేయుచున్నాఁడ.

— గ్రంథకర్త.

# పరితప్త సుయోధనుఁడు

( ఏకపాత్రాభినయము )

స్థలము :- అభ్యంతర మందిరము.

(ఒక హంసతూలికాతల్పము, దానికిం దలవైపున నొక యున్న తాసనము, కాళ్ళవైపున రెండుచితాసనములు కవచ కార్ముక బాణ తూణీర ఖడ్గగదాదులు వింజామరలు మొదలగునవి సముచిత స్థానముల నుండును)

[ద్రౌపదీ పరిహాసజనితక్రోధ పరితప్తహృదయుఁడైన సుయోధనుఁడు తల్పమునకుఁ జేరువనున్న రత్నస్తంభముమీఁదఁ జేయివైచి వ్యసనసహితాలోచనా తత్పరుండై యుండును.]

పరాభవము... ఈభవమింక భరింపరాని పరాభవము. దివ్యమణిగణోజ్జ్వల హాస్తినాపుర సింహాసనాధీశుండైన సుయోధన సార్వభౌమునకా పరాభవము. మానధనుండై కురుకులాలంకారుండైన సుయోధన చక్రవర్తికా యవమానము. భరత వంశాబ్ధి రాకాశశాంకునకా అరాతిపత్నీకృత పరాభవ కళంకము. ఆహా! నాకెట్టి పరితాపమును గూర్చితివి. ఓ పాండవ పట్టమహిషీ! నీవు నిజముగ మహిషివై జన్మించుటకు మాఱుగా మానవజన్మమెత్తినది మాయట్టి మానవపతుల అవమానపఱచుటకా. ఓసీ! బంధకీ!! పంచపురుష బాహుపంజర బంధకీ! నిర్వర్తిత రాజసూయధ్వర మాత్రమదోన్మత్తా! ప్రముదితచిత్తా!! పరిహాసము చేయుచుంటివా. ఆహా! కాలమహిమ. నీ నవ్వు పువ్వులతోఁ బాటు త్వదీయ జటాబంధాలంకృత నవమల్లికా పుష్పంబులు శిరోరత్నములతోఁ గూడ నక్షత్రములవలె రాలుచున్నవే. ఆఁ! ఆఁ!! ఆఁగుము. ఈ రాజసింహము

అకాల ప్రళయరాహువై వజ్రసన్నిభ సహస్ర దంష్ట్రాయుత వక్త్ర మును దెఱచి నీ సంతోష శీతభానుని మ్రింగుటకు వేచియున్నది.

ఈ పరితాపాగ్ని చల్లార్పఁగల అమృతభాండము నా కెవరి యొద్ద లభించును .. లభింపదా?... అటులైనచో నాకీభోగము లేల ఈ సామ్రాజ్య మేల .. (నికటమునఁగల మేజాబల్లను సమీపించి పచ్చలపిడిబాకు నందుకొని) ఈ బాకుతోఁ బొడిచికొని చచ్చుట మంచిది. (యోచించి బాకును యథాస్థానమునకు విసరివైచి) ఛీ! నేను చచ్చి సాధించునదేమి? నాజీవిత రచనాఘట్టమున అవమానభాగము తొలంగింపఁబడునా .. పరాభవమునకుఁదోడు దుస్స్మరణము. ఆఁ! నేఁడుగాకున్న రేపైనను సర్వము బయల్పడకమానదు. అప్పుడు లోకులందఱు విపరీతార్థములుకల్పించి చేతగానిబీరువై ఆత్మహత్య చేసికొనినని నన్ను పరిహసింపక మానరు. ఆనాఁడు నా జీవితము అవమానపూరిత విషాదాంత నాటకమై రంగస్థలమున కెక్కును. అది మాయనిమచ్చ. ప్రత్యర్థులకు ప్రతీకార ప్రతిఫలము చవి సూపఁజాలని పౌరుషహీనుఁడనా నేను. కాను... అట్లెన్నటికినిగాను... గండరగండఁడను - మహోద్దండ చండశాసనుఁడను. పాండవ వంశ వృక్షమును సమూలముగ ఛేదింపవలయునని నా చేయు ప్రయత్న ఝుఝుంఝూమారుతమునకు ఈశ్వరాజ్ఞ మహాపర్వతము వలె అడ్డు తగులుచున్నదే... ఈ మహాపర్వతమును బ్రద్దలుచేయఁగల వజ్రాయుధము నా కేది?... వజ్రాయుధము... ఈశ్వరాజ్ఞ... ఆఁ! (వెగటుగ నవ్వి) ఈశ్వరాజ్ఞ అననేల మాతండ్రిగారి దయయు, భీష్మ విదురాదుల ప్రేమయు, కృప ద్రోణాదుల వాత్సల్యమును వారలకుఁ బెట్టనికోటలై సురక్షితులను జేయుచున్నవి. కానిమ్ము. వీరియాట లెంతవఱకు సాఁగునో చూచెద...

ఇప్పటివఱకు ఇల్లు - వాకిలి లేక ఊరును - పేరును లేక మూపంచ కాచుకొనియున్న ఈ పాండవులకు ఇంద్రప్రస్థపుర మొసంగిన వృద్ధరాజు నేమనవలయు. ఇచ్చెనుబో ... అంతమాత్రముననే మన్నుమిన్నుగానక భీమార్జున నకులసహదేవులు ప్రాగుత్తర దక్షిణ

పశ్చిమదిశలు జయింప మహోత్సాహంబున రాజసూయాధ్వరమ్ము తలపెట్టనేల... తలపెట్టెనిపో - రాజకీయపరిజ్ఞాన శూన్యులు - నీతి బాహ్యులు - పరాన్నభుక్కులు - పరవంచనాసక్తులు అయిన పాండవాధములు - కాదు కాదు-అంతియ కాదు... వారేపురలో పయోముఖ విషకుంభము - మేఁకవన్నె పులి- మెత్తనికత్తి అగు ధర్మరాజు పంపిన ఆహ్వానమంగీకరించి నే నటకరుగనేల... అరిగితినిపో (విచారముతో) దుర్వ్యాధాజనకమగు శిశుపాల వధ కనులారఁ గాంచియు- అటనుండి ఆ నికృష్టపు మయసభ చూడ నేనొంటరిగ పోనేల. పోయితి ననుకొనుము ప్రమాదమున కేనటఁజిక్కనేల? ఆపాపాత్మురాలైన పాంచాలి పకపక నవ్వనేల - నిజముగా ఆ జహుభర్తృక శంకాటంకములులేక వికవిక నవ్వినంతమాత్రమున నాకది పరాభవమా... నానా రాజరత్న చిరత్నరత్నరంజిత పాదపద్ముండనైన నాకది అవమానమా - (క్రోధముతోఁగూడిననవ్వు) గజరాజము రాచవీధి రాజమార్గమునఁ జనుచుండ కుక్కలు మొఱుగుటలేదా. (ఆలోచనతో నటునిటు తిర్గి) కాదు. ఎటుచూచినను పరాభవము పరాభవమే. (తలయూఁపుచు విసపునవ్వునవ్వి) గోరుతగిలినంతమాత్రమున చీమయైనను ప్రాణమునకు తెగించి కుట్టుచున్నది. కాలు తగిలినంత మాత్రమున ధూళి చెలరేఁగి తన్నుఁదన్నినవాని తలఁదన్నుచున్నది. ప్రాణహీనమైన పరమాణువే అంతపగ దీర్చుకొనుచుండ ప్రాణికోటియందు ఉత్తమస్థానము వహించిన మానవుండనై చతురుదధివేలావలయిత మహాసామ్రాజ్యమునకు సార్వభౌముండనయిన నేను ఒక్క ఆఁడుది... అవహేళనముచేయ చూచి సహించుటయా - పంచభర్తృకయగు ఒక్క పాంచాలియే కాదు - భీమాదుల కంఠధ్వనులు గూడ ఎంత నిర్లక్ష్యముగ వినఁబడినవి (క్రోధావేశమున నిట్టూర్చి క్షణము కూర్చుండి) విధి అలంఘ్యము. నన్నిట్లవమానించుటకు కుయుక్తులు పన్ని రాజసూయాధ్వర మిషచే ఆ పాడుమయసభ నట్లేర్పాటుచేసి పిలిచిరి కాఁబోలు. (లేచి) నిజముగా దీనికంతటికి కారణము ఆ మయసభ... కావున ఎట్లయినను దానిని నా స్వాధీన

మొనర్చుకొనెద. లేదా సర్వనాశనము చేసెద. పరిభవ వికారంబు తోఁపనీక నన్ను నేనుపశమించుకొని యెఱుఁగనట్లూర కుందునన్న నది నాకసాధ్యమై శుష్కతృణరాశింబడిన యగ్నికణంబుంబలె నది లోలోఁ గుములుచుఁ గ్రోధావేశ ధూమకీలలతోఁ బైకుబికి వచ్చు చున్నయది పరాభూతి గ్రీష్మాతపమ్మునఁ బరితపించుచున్న నాకుఁ బాండవ పరాజయ మలయమారుత మెప్పుడు ప్రాప్తించును.

ఓరీ! కురుకుల భారభూతులారా!! కుంతీపుత్రులారా!!! మీ రందఱు కలసి నన్నింతవమానముపాలు సేయుదురా. చేసి నాయెదుట మీరింక సక్రమముగ భూమిపై జీవింపఁగలరా – (తీక్ష్ణదృష్టిం బ్రసరించుచు యోచించి) చతుస్సముద్ర ముద్రిత సర్వంసహా చక్రమున కేకచ్ఛత్రాధిపత్యము వహించి ప్రళయకాల పర్జన్యగర్జానిభ సింహనాదములతో తండోపతండములుగా మహోద్దండ భండనమునకై ముజ్జగంబు లెత్తివచ్చినను జయింపఁగల నూర్వురు సహోదరుల కగ్రజుండనై దిగ్దంతిదంతకాంతిచ్ఛటాకలిత యశశ్చంద్రికా శోభితంబగు భరతవంశమునఁ బుట్టి శిక్షితరణవిద్యాదక్షులైన అనేకాక్షౌహిణీ సైన్య పరిరక్షకుండనైన నేను తలఁచుకొన్న ముల్లోకంబుల నుఱ్ఱూఁతలూపనే... (వెగటుగ నవ్వి) మీరొక లెక్కయా నా సామంతరాజులలో ఒక్కరుగానుండి ఏమూలనోపడియుండవలసిన మీకు ఇంతలో కన్నులెంత నెత్తికెక్కినవిరా–కట్టకడ కెట్టెట్టో ఒక్క రాజసూయము రణరంగముగామాఱి నిర్వహింపఁబడినంతమాత్రమున నింతపొగరా– (క్రోధావేశముతోఁ గంపించి) అబ్బా! భరింపఁజాలను ఈ తాపమును భరింపఁజాలను... ఈ పరితాపమును సైరింపఁజాలను... నా శరీరమంతయు అగ్నిగోళమైనది ఈ మందిరమంతయు మండుచున్నదా... నా హృదయకుహరమున పరిభవ వ్యసనాగ్ని ప్రజ్వలించుచున్నదా... పంచాగ్నుల మధ్యముననైన నిలువవచ్చు – ప్రళయకాల ప్రజ్వలిత బడబాగ్నిజ్వాలలకైనఁ దాళవచ్చు – పశుపతి ఫాలనేత్రాగ్నికైన నోర్చుకొనవచ్చు. కాని ఈపరితాపాగ్నిని సహింపలేను – ఈ అవమాన ప్రవాహమున కొట్టుకొనిపోవుచున్న

నాకిఁక ధర్మాధర్మములతో న్యాయాన్యాయములతో సత్యాసత్య ములతో బాంధవ్యాబాంధవ్యములతో పనియేమి - ఎవఁడిప్పుడు నా కాపుఁడు... ఈ కష్టవార్ధిని దాటింపంగల కర్ణధారి యెవ్వఁడు? (యోచించి) కలఁడుకదా - మాయానాటక సూత్రధారి, మచ్ఛ్రేయోఽభిలాషి - మామ - శకుని. అతని ప్రసిద్ధబుద్ధి బలంబును, అర్ణవగంభీరుఁడగు కర్ణుని బాహుబలంబును నాకు వర ప్రసాదములు కాకుండునా. ఓరీ నీచులారా! ఏకచక్రపురంబున జోలి కట్టుకొని ఇంటింట బిచ్చమెత్తుకొని జీవించిన (నవ్వి) మీరా నన్ను పరిహసించుట... ఔరా! మఱతునన్నను మఱపురాక మయసభా దృశ్యము నా కన్నులఁగట్టినట్టున్నది - నా హృదయ భూగోళమున ద్రౌపదీ పరిహాస వివిధ ధాతుసంఘర్షణచే పరాభవాగ్ని పర్వతము పెకలునఁ బ్రేలుచు (తీవ్రసంచలనము) సంతాపవహ్ని జ్వాలలను వ్యసన విషవాయువులను క్రోధ శిలాఖండములను నిశ్శంకాపంకము లను ఎగఁజిమ్ముచున్నది. పుణ్యాపాపములారా! దూరముగాపొండు. మానాభిమానములారా! నన్ను మఱచిపొండు. కఠినత్వమా! నీవు నా హృదయ సింహాసనమధిష్ఠింపుము. ప్రతీకారాన్వేషణమా! నీవు నాకు మార్గదర్శివికమ్ము. ఓరీ భీమా! అనేక వైరివీరశిరోరక్తధారా పానప్రవీణ ప్రముదిత ప్రచండ ప్రభాయుతా స్మద్గదాఘాతంబున నిన్ను తుత్తునియలుచేసినఁగదా నాజన్మము సార్థకమగును. ఓరీ అర్జునా! నిర్జరులకేని దుర్జయుండనని గర్జించుచున్న నిన్ను నిర్వక్ర పరాక్రమోపార్జిత యశోవిశాలుండగు ఈ సుయోధనసార్వభౌముండు శరపరంపరలచేఁ జించి చెండాడకుండునా - (వికటముగ నవ్వి) నీ కొఱకు నేనుగావలయునా - మీ వంశార్ణవమును ఘూర్ణిల్లఁజేయఁ గల నిర్నిద్రతేజశ్శాలి మా ప్రియమిత్రుండైన కర్ణుఁడొక్కఁడుచాలు (యోచించి) ఇట్లు చేసినచో నిష్కారణముగఁ బాండవులను నాశ నము చేసినాఁడను నపఖ్యాతి గలుగునేమో - నా వంశమర్యాదకు ఇది భంగకరమగునా - (క్షణమాఁగి) ఏమి నావెఱ్ఱి. దీనికింత యాలో చనయా - ఇంత కాలవ్యవధియా.

ఓరీ! పాండవాధములారా! మీ దురహంకారముఁ గాంచి సహించియుంటకు ఈ ధార్తరాష్ట్రాగ్రేసరుఁడు సామాన్య మానవుఁ డనుకొంటిరా - క్షత్రియకుల పాంసనులారా! (రౌద్రరసోద్దీప్తుఁడై) మీ యైశ్వర్య గర్వమత్తశుండాల కుంభస్థలమును పగులఁగొట్టి కురుపరివృఢుని కీర్తిముత్యములు నలుగడలఁ గడలుకొనఁజేయ నా నిరంకుశ శాసనసింహము పంజావిప్పి వేచియున్నది. అస్మత్క్రోధ దవానలమునకు మీరు మిడుతలవలె భస్మముగాక మానరు. నా పరాభవమను మహాభూతము తన కరాళవక్త్రమును తెఱచి నాల్క సాచి మిమ్ము బలిగొన నెదురుసూచుచున్నది. పాంచాలీ పరిహాస పాపవల్మీక బిలనిర్యద్ద్విజరాజ వ్యసనాశీ విష విషానల జ్వాలా మాలికలచే మీరు నీఱై తీరుదురు. సౌబలేంద్రజాలికావిష్కృతేం ద్రజాలంబునందవిలి నా పడిన యవస్థకంటె వేనవేల్ రెట్లవమానము నొంది యుక్కఱి దిక్కుదెలియక చిక్కులంజిక్కియున్న మిమ్ము పాతాళమ్మునకంటఁ ద్రొక్కుట నిక్కమ్ము. కృష్ణ సాహాయ్యమ్మున ద్విగుణీకృతోత్సాహ పూరితమైన మీ సాహసోరగరాజము నిజ సహస్రఫణములవంచఁ దన్నుకొనిపోవ మత్ప్రతాప గరుత్మంతుఁడు ఱెక్కలల్లార్చి వెల్లుబికి యెగిరి వచ్చుచున్నాఁడని గ్రహింపుఁడు. సుయోధనమదకరీంద్రము ఇంద్రప్రస్థపుర సరోవరముసొచ్చి పాండవ మృణాలజాలముల సమూలముగఁ బెరికివైచుటకురుకుచున్నది. మయ సభతోఁబాటు ఇంద్రప్రస్థమునుగూడ కాల్చి మసిచేసినఁగాని నాకసి తీఱదు. మీ బలిమి కలిమి మీ కులుకుతుళుకులు మట్టిపాలు గానున్నవి. ఎప్పుడో కాదు ఇప్పుడె.

(గద భుజమునధరించి నిష్క్రమించును)



# అశ్వత్థామ

[ ఏకపాత్రాభినయము ]

స్థలము:- కురుక్షేత్ర ప్రాంత కాంతారమునందలి వటవిటపి నికటంబునంగల సమతల ప్రదేశము.

సమయము:- రాత్రి ద్వితీయయామము

(దివాచరంబులగు సత్త్వంబులు సుప్తింజెందియుండ రాత్రించరములగు ఘోర వన్యమృగంబులు స్వేచ్ఛగ సంచరించుచుండు. కూ్రరజంతువు భయంకర ధ్వనులెడనెడ వినఁబడుచుండు అత్తరి అశ్వత్థామ కించుక యెడముగఁ గృపాచార్య, కృతవర్మలు నేలపై శయనించి నిద్రించుచుందురు. ముప్పురు నాయుధపాణులై రక్తసిక్తాంగులై యుద్ధరంగమునుండి వచ్చినవారే కృపాచార్య, కృతివర్మలు రంగస్థలమునఁ గనంబడరు. అశ్వత్థామ ఖడ్గ శరశరాసనాదులు పార్శ్వంబుననిడుకొని పుడమిపైఁ బరుండెంగాని క్రోధశోకదందహ్యమాన మానసుండగుట నతనికిఁ గూర్కు రాదయ్యె. పాండవులపైఁ బగసాధించుటెట్లాయని యతండాలోచించుచు వటవృక్షమువంక దృష్టిం బ్రసరించి యుండొక్క దివాంధమున్న గనుంగొని దాని చర్యలఁ బరికించుచు లేచి కూర్చుండి)

ఈ నిశాసమయమున ఈ వటవృక్షశాఖాగ్రమునఁజేరి మిడుఁగురు పుర్వుల గుంపులవలె మెఱయుచున్న తన మిడిగుడ్లను తెలను అటునిటు త్రిప్పుచు నలువలంకులఁ గలయఁగనుగొనుచు భీకరాకారమునఁ గనఁబడుచున్న ఆ గ్రుడ్లగూబ మృత్యుదేవతకు నెచ్చెలియై

తన పేరు సార్థకము చేసికొనుచున్నది. అదిగో! లేచి ఱెక్కలల్లార్చి ఆమిషాన్వేషణవ్యాజమ్మున నిక్కినిక్కి చూచుచు శత్రుతతులయిక్క లరసి పెక్కుతెఱంగుల విచ్చలవిడిగ విజృంభించుచు దిక్కటాహ ములు బీటలువాఱ గుజ్జుగుజ్జని గొతుకుచున్నది. అహో! ఏమి యీ విచిత్రచిత్రవధాదృశ్యము. పగటివేళ బయటికివచ్చినఁ దన్ను బ్రదుకనీని కాకులమూకలను నిద్రించుచున్నవానిని యీరాత్రివేళ ఆ ఘూకరాజము రాజసమున దుర్వారఘోర వీరవిహారమునసల్పుచుఁ జించిచెండాడుచున్నవి. ఓమానవుఁడా! అప్రతిహతప్రతీకారవాంఛ నీకున్నచో నీవును వైరిసంహారమిట్లు సేయందగునని యీదివాంధమే నాకుఁ బ్రత్యక్షగురువై ప్రగాఢముగ బోధించుచున్నది. కావున ఈ రాత్రియె శాత్రవుల నిష్కళంక రాజభక్తిమై యమనిలయమున కంపెద. దివససమయమున దక్షుండగు నప్పుండరీకాక్షుఁడు రక్షణా దుర్గమ్ముగఁగాపాడుచుఁ జెంతనుండఁ బాండవపాంచాలుర వధించుట దుర్లభము. ఇదియె నాకుఁదగిన తరుణము.

నానారాజన్యమకుటఘటితరత్న నీరాజనవిరాజిత పాదపద్ముం డవగు ఓ దుర్యోధన సార్వభౌమా! ఈ నాశరీరము నీయుప్పుపులుసు లతోఁ బెరిగినది. నీవలన కష్టనష్టములెఱుంగక యష్టైశ్వర్యముల నద్వితీయానందమును ననుభవించితిమి. గోరంతేని కొఱంత లేక మమ్ము కంటికిఱెప్పవోలెఁ గాపాడితివి. మాయందలి ప్రగాఢవిశ్వా సముతో నీవీయుద్ధమునకు సిద్ధపడితివి. ఇఁక మేము నీ ఋణమెట్లు తీర్చికొనఁగలము. భవత్స్వరూపమును మేమెట్లు మఱచిపోఁగలము.

గదాయుద్ధమునఁ గృష్ణప్రేరణమున నన్యాయమ్ముగ భీముడు నిన్నుఁ దొడలువిఱుగఁగొట్టి పడవైచెనా? పడవైచుటేగాక వాఁడు వెనుకటి కథలనుద్రవ్వి మదోన్మత్తుఁడై మన్నుమిన్నెఱుంగక కురు సామ్రాజ్యరమారమణ చిహ్నముగ దివ్యజలాభిషిక్తంబైన నీతలను

దన యెడమకాలితోఁ దన్నినా? దానికే యండలేని నీగుండెనుమండు చుండ నాకండలు పెరిఁగిన తిండిపోతు తనయిష్టమువచ్చినట్లు నినుఁ దూలనాడి గదాదండమున నీ శిరమదిమిపట్టి మఱియొకసారి నిజ వామపాదతాడిత శిరస్కునిగఁ జేసెనా? ఆహా! ఏమి కాలవైపరీత్యము! ఇది కనులారఁజూచి యుద్ధధర్మంబు రవ్వంతయు పాటింపమి కమిత రోషారుణరూక్షేక్షణుండై బలరాముఁడు దిక్కుడ్యములు పెఠిలునట్లుల సింహగర్జన చేసి పుడమి గజగజవడంక నిజాయుధంబైన నాగటిసత్తి యధర్మవిజయగర్వాంధకార మగ్నమానసుండగు పాండవ మధ్య మునిపై కఱికెనా? రజతాద్రిని సమీపించిన యంజనగిరివలెఁదన్ను డాసి తటాలున పట్టుకొన్న వాసుదేవుని సవినయ యుక్తియుక్త వచ నంబుల నించుక శాంతించి కౌంతేయులనిందించి ప్రేమపాత్రుండగు తమ్ముని మందలించి నీచపుగెలుపు గెలిచిన భీముని లోకము పొగ డినఁబొగడుఁగాక వీరమరణమునకైన సమ్మతించెంగాని యధర్మ యుద్ధమునకు సమ్మతింపని ధర్మాత్ముండైన కురురాజుత్తమ లోకము లకుఁ జనునని పల్కి యిఁక నిట నిల్వరాదని తన రథంబున హలా యుధుండు మరలిచనెనా? ములుకులవంటి యాతని పలుకులకుఁ బాండవపాంచాలురు సిగ్గునఁ దలవంచుకొనిరా? ఇట్టిమాటల నీనోట విని క్రోధానలజ్వాలామాలికలచేఁ బాండవ పాంచాలాటవుల దహిం పక చేతులు గట్టుకొని నిల్వఁగలనా? ఆ రాజు ఋణము తీర్పలేని నా బలపరాక్రమములెందుకు? నేనవలంబించిన క్షాత్ర ధర్మమెందు లకు - నా యస్త్రశస్త్రములెందుకు? నా జీవితమెందుకు?

ఓ కురుకులాలంకారా! వీరాధివీరా!! పుష్పఫల సంభరితమైన మొక్క పెనుమ్రాను కాలవశంబునఁ గొమ్మలన్నియునశింపఁ గళా హీనముగఁ గడకు బోదెమాత్రము నిలిచియున్నట్లు - అనుజ తనుజ పరిజన బంధుమిత్రసైన్యంబులు నేలంగూల దిక్కుసెడి నీవొక్కండ

నరులకుఁ జిక్కి యిట్టి హైన్యదైన్య స్థితిం బొందితివే? దీనికిం బ్రతీకారముసేయకున్న నేను అశ్వత్థామనా? ఓ సార్వభౌమా! నీ సైన్యమునఁ గృపాచార్య కృతవర్మలు, నేనుమాత్రమె నీ స్థితింజూడ ప్రాణములతో నిల్చియుంటిమి

ధార్తరాష్ట్రాగ్రణీ! రక్తపు మడువునంజిక్కి కదలఁ జాలక చేతులు నేలమోపి భగ్నపరభాగంబయ్యుఁ బడగవిప్పిన మహోరగంబుచందంబున వేఁటకానిచే వెనుకటికాళ్ళు రెండును ద్రెళ్ళనేయబడిన మృగరాజుంబలెకోఁజుచు నక్రమచర్యను సముత్సాహముతో ప్రోత్సహించిన పాండవ పక్షపాతియగు కృష్ణుని ములుకులవంటి పలుకులతో నాక్షేపించితివా? నీ ఘోరమరణావస్థంజూచిన నాకు శోక క్రోధంబులు పొంగిపొరలుచున్నవి. ధనురాచార్యుండని జగత్ప్రఖ్యాతిగాంచిన నా తండ్రి మరణించినప్పుడును నేనింతటి పరితాపము పొందలేదు రాజరాజ! పాండవ పాంచాలవంశముల నిశ్శేషముగ నాశనముచేసి నీకావార్త వినిపింతునని ఖడ్గసాక్షిగాఁ బలికినంత శ్రవఃపేయముగవిని నన్నుఁ బ్రియముమీర కౌగిలించుకొని సైన్యాధ్యక్షుఁడుగ నభిషిక్తుని జేయించి పంపితివే. ప్రతీకారము చేసి ప్రతిన చెల్లించుకొనకనే బ్రతుకుట భూమికి బరువు చేటు.

ఏకాదశాక్షౌహిణీనాథుండవగు నో కురునాథా! నీవిప్పుడనాథుడవై రక్త పరిషిక్త దేహుండవై ధూళి ధూసరితాంగుండవై యొంటిమై రణధరణిఁ బడియుంటివా? దుమ్ముగ్రమ్మిన ముఖమ్మునపై ముంగురులు కెంగేల నటునిటు తొలఁగఁ ద్రోసికొని నా మోము చూచి పాండవుల నిందించుచు నొడుగఱచి కన్నీరు కార్చి నిట్టూర్పు నిగిడించి కట్టుసుకుతో హీనస్వరముతో నీవాడినమాటలు మాటిమాటికి నా చెవులఁ బ్రతిధ్వనించుచున్నవి. సహోదర సుహృద్బంధు ముఖ్య పదాతిబలంబులు నశింపఁగడకు స్వల్పసేనతో నీవొక్కండవ

పెక్కురతో మొక్కవోని శౌర్యంబునఁ బోరిపోరి బహువిధశస్త్రాస్త్రంబులక్షతగాత్రుండవై మహాపర్వతమునుండి ప్రవహించు గైరికాది ధాతువితతిసహిత ఝరీనికరములవలె నీ శరీరమునుండి శోణిత ధారలు స్రవింప డస్సి డప్పిగొని జలస్తంభన విద్యచే ద్వైపాయన హ్రదగర్భంబునఁ జేరి సేదదీర్చుకొనుచున్నవాని నతిరథమహారథులని ఖ్యాతినొందిన యదు పాండవ పాంచాల ప్రముఖులెల్లరు గుమిగూడి చుట్టుముట్టి ధర్మజుని పోటుమాటలచే నిను బయటికి రప్పించి నేనిప్పుడు యుద్ధము చేయఁజాల. ఇఁక నరణ్యములకు వెళ్ళి తపస్సు చేసికొనెద. విజయము నీదే వెళ్ళి రాజ్యము పాలించుకొమ్మని కౌంతేయాగ్రజునితోఁ బలుక వారందఱు గగ్గోలుగ హేళనచేసి బవరమునకుఁదిగిచి గదాయుద్ధమున నాభికిదిగువఁ గొట్టఁగూడదని నియమముండ దాని నుల్లంఘించి వృకోదరునిచే నీ తొడలు నుగ్గునుగ్గుగా విఱుగఁగొట్టింతురా! ఋణశేషము. వ్రణశేషము రణశేషము ఉండ రాదనెడి నీతిం బాటింపఁదలఁచి కాఁబోలు నిశ్శంకముగఁ గృత్రిమ కృత్యంబొనరుటకు సాహసించిరి. అసమానమానధనా! చండశాసనుండవైన నీవు చివఱిదశలోఁగూడ భండనమునకు నీకు సముండని భీము నేకోరుకొని ప్రముఖ శాత్రవుల గుంపులో నీ వొక్కరుండవయ్యు మేరునగధీరుఁడవై యిసుమంతైన రణ ధర్మము తప్పవే, ఏమి నీ పవిత్రమైన క్షాత్రము. నీ గోత్రము పుణ్యమునకుఁ బాత్రమైనది. నినుఁగన్న తలిదండ్రులు ధన్యులు. నీకిచ్చిన వాగ్దానమును జెల్లించుకొనుటకిప్పుడే బయలుదేరుచున్నాఁడ. (రెండుమూఁడడుగులువైచి లోనికింబరికించి) మా మామయుఁ గృతవర్మయు గాఢనిద్ర మునింగియున్నవారు.

వీరవరులారా; మేలుకొనుడు కట్టా! ఇట్టి యిక్కట్టున మీకెట్టు నిదురపట్టినది. ఒంటిమైఁజిక్కిన కురుకుల సార్వభౌముని ధర్మ యుద్ధమునఁ గూర్చిన పగఱఁ బరిమార్పక నే నిద్రింప. న్యాయా

న్యాయంబులఁ జర్చింప ఎత్తినతఱి - విడిసినపుడు - ఇరుకుదారి గతి చెడిన సమయమున - నిద్రపోయెడువేళ - శత్రువుల నిగ్రహింప వచ్చునని క్షత్రియధర్మంబు తెల్పెడు. నేను దాని ననుష్ఠించుటంజేసి కపటోపాయులగు పాంచాల కౌంతేయులఁ గృత్రిమ మార్గమునఁ దుదముట్టించితి. మన మోడి దిక్కుసెడి పుట్టలఁ జెట్టుల గట్టుల మిట్టలఁ బడియుందుమని తలంచి యపహసించి విజయోత్సాహంబున హాయిగా నిద్రించియుందురు. వారి మద మడంప నాకదనిది. మీరేమి పల్కెదురో పల్కుఁడు. ఆఁ! మాతులా! యేమనుచుంటివి? గాంధారీ ధృతరాష్ట్ర విదురులెట్టు చెప్పిన నట్టు చేయుదుమనియా - వారి మొగము నేనెట్లు చూడఁగలను? దానికిది తగిన తరుణము కాదు నిద్రించినవాని - ఆయుధములు విసర్జించినవాని - భగ్నవాహనుని - శరణుచొచ్చినవాని - తలవీడినవాని జంపుట నరక హేతువనుచుంటివా? అట్లైన నిందు పాండవులెన్ని యాచరించిరో జ్ఞప్తికిఁ దెచ్చికొంటివా? ఈయొక్కదానికే నన్నుఁ గాదనుచున్న నీ వాదినుండి యంత్యమువఱకు రణమునఁ బాడిదప్పి వర్తించిన పాండవపాంచాలురకేల ధర్మోపదేశము చేయవైతివి? నన్ను శాసింపఁ దగినవాఁడవగుట నీ చెప్పినది కాదనఁగాని ధర్మరాజబద్ధమాడ సన్న్యస్తశస్త్రుడైన నాజనకుని దురాత్ముఁడగు ధృష్టద్యుమ్నుఁడు మహాపాపమునకొడిగట్టి తల తెగగొట్టె. భీషణ సంగ్రామరంగ గ్రీష్మభానునిభుఁడగు భీష్ముని శిఖండిపేర, గపట కదనమున ఘోరనరక హేతువనక యర్జునుఁడు వధించె. రథము ధరణిం గ్రుంగ నిరాయుధుండై దిగి దానికి నిజభుజ శిఖరము మోపి కరంబులఁ దచ్చక్రము నెత్తుచున్న సూతసుతుని నిర్భర నిరయ కారణము నాకనరుఁడు నిశిత శర పరంపరలఁ బఱపి పొరిగొనె. పార్థుడు నిజహస్తము ఖండింపఁ బ్రాయోపవేశ దీక్షతోఁ బ్రశాంతముగనున్న భూరిశ్రవుని సాత్యకి నుతైన పాతక భీతిలేక తుత్తునియలొనర్చె - ఇఁకఁ గౌరవేంద్రుని బడఁగొట్టిన విధ

మా వీరశిఖామణి నోటనే నీవు వింటివిగదా! వేషభాషలకనుచితంబులగు నిన్ని దోషంబులాచరించిన వారిం దూషింపక యేమని నాకు నీతి గఱపుచుంటివి? జ్ఞానవయోవృద్ధులగు గాంగేయుఁడు మత్పిత్రుదేవుడు పల్మాఱు పాండవులఁ బొగడుచుంట విని నేనది నిష్కలంక సత్యమని నమ్మి ధనుర్విద్యా ప్రదర్శనము నాఁటినుండియు నంగరాజును రారాజును బెక్కుసార్లెదుర్కొంటిని. ఈదారుణ రణచర్యల సింహావలోకనము చేయ నాకు సత్యము గోచరించినది. నా మనసు మారినది. పగదీర్చుకొని ప్రభుఋణవిముక్తుండవుకమ్మని నాయాత్మ బహువిధముల బోధించుచున్నది. ధనురాచార్య వధాసంతోషిత స్వాంతుండగు పాపిని ధృష్టద్యుమ్నుని ఈ రాత్రియె పశువుం జంపినట్లు చంపెద. దీన నాకెట్టి కిల్బిషంబు గల్గినంగల్గుఁగాక. కీటక జన్మంబు ప్రాప్తించిన ప్రాప్తించుగాక, ఈ నాదీక్షమాన. మీకిచ్చియున్నగండు - లేదే నెటకేఁబోండు (ఆలించి) ఆఁ! ఏమనుచుంటిరి? సూర్యోదయావసరమున సమరమున కుపక్రమింతుమనియా! అది నా కసమ్మతము. రాజు విగతజీవుఁడైనచో నాకృత్య మెవరిని సంతోషపెట్టఁగలదు. రాజకార్యార్థమేక నిర్ణయముః వధ్ఁతి మనుచుంటిరా - అస్త్రైన నా వెనుకరండు క్రోధోదన్వాసనోదన యత్నుండనై సమర సన్నద్ధుండనగు నన్ను మీఁరాఁపఁజాలరు. సూర్యచంద్రుల గతి మారినను నా మతి మాఱదు. ధర్మజా! నీవు గోముఖ వ్యాఘ్రమవు - అడుగడుగున ధర్మహానికిఁ దలపడిన నీవు, సర్వసైన్యాధ్యక్షులైన యతిరథ మహారథులపాలిట ధర్మరాజవుకావు. యమధర్మరాజవు. మజ్జనకుని చావుగోరి "అశ్వత్థామహతః" అని పల్కిన యసత్యవాదివి. వజ్రిం వజ్రేణభిద్యతి - అధర్మమును అధర్మము చేతనే జయింపవలయు. యశోదానందనుండు సాక్షాత్తు భగవంతుఁడని పెద్దలనుచుండిరే అట్టి మహానుభావుని ప్రేరణమున యిట్టి యకృత్యము లేల జరుగవలయు.

పాండవులారా! మీరందఱు కృష్ణుని చేతి కీలుబొమ్మలు. సుయోధనుఁడు తనమాట వినఁడని మీరమిత విధేయులని దాసానుదాసులని తన యౌన్నత్యము పెత్తనము భారతమున నద్వితీయముగ సాగునని, మీయభ్యుదయ మతని యభ్యుదయమని యా దేవకీనందనుండు మీ విజయమునుగోరి పన్నిన మాయలన్నియు నెన్నఁదగిన వన్న నెవరు కాదందురు. ఆదినుండియు సంకర్షణుండున్నచో మీ సంగతి సంఘర్షముగ నుండి యుండెడిది.

అభిమన్యునొక్కనిఁ బాడిదప్పి పలువురుచేరి వధించిరనిగదా మీరనుట. సంకుల సంగర రంగమున వ్యూహాభేదన సమయమున నొక్కండు పలువురఁ బలువురొక్కని మట్టుపెట్టుట నిచ్చలు గనుచున్నదేగదా! అది నేరమెట్లగును అగుఁగాక. అది యత్యంత స్వల్పము. ఇఁక నీ కురుక్షేత్ర సంగ్రామము ప్రారంభించినప్పటినుండి మీరు చేసిన యన్యాయకృత్యములు తలఁచుకొన్న నే వీరవరుఁడును కోపోద్రిక్తుండు కాకుండు. యుద్ధమునకు ముందొండొరులకుఁ జేసికొన్న యుపకారములకు. సమర ధర్మములకు మసిపెట్టుట యే చట్టమొప్పుకొనదని విజ్ఞులెఱుఁగుదురు. కాన మీ కపట నాటకములన్ని సమర్థించుకొనుటకుఁ జేసెడి కువ్యాఖ్యానములకిఁక విలువయుండదు కర్ణదుర్యోధనుల మరణమునకై యెన్నుకొన్న దుర్నయమును నే నెట్లు మఱచి పోఁగలను? సుహృజ్జనవిధేయా! రాధేయా! దాతలకెల్ల దాతవై మహాదాతయనెడి యశశ్చంద్రికల దిగ్విదిక్కుల వెదజల్లిన నిన్ను - ఏకపత్నీవ్రతస్థుడవైన నిన్ను - ఆడితప్పని నిన్ను - దైవభక్తి, పితృభక్తి, గురుభక్తి, రాజభక్తి నూటికి నూఱుపాళ్ళు ప్రదర్శించిన నిన్ను - రవితేజః పుంజ రమణీయముగ రాజిల్లు నిన్ను - అపార్థుఁడు రణధర్మ సేతువును దెగఁగొట్టిగదా నీ జీవవాహినిని వెడలఁగొట్టినది. సౌందర్య సౌజన్యములఁ గురుపాండవుల యందొక్కండైన నీకెనయనఁదగినవాఁడు లేఁడనుట నిక్కంబు. ఇట్టి నిన్ను

మగు నిస్తుల మహాభూతము. రక్తరాగ ప్రభాజిత వ్యాఘ్రచర్మము ధరించి యజ్ఞోపవీత గ్రైవేయ నూపుర భుజకీర్తులుగ ఆలోల విషాగ్ని కరాళజిహ్వాకలిత వక్రయుత భుజగరాజములఁదాల్చి సిత నిశితాతతదీర్ఘదంష్ట్రాప్రకట భయంకర వివృత విశాల వక్త్రబిల ములో నిశాంతహుత వీతిహోత్రకుండ సదృశములతోజ్జ్వలానేక సహస్ర నేత్రములతోఁ గుటిల కపిలజటాపటల భాసితోత్తమాంగం బులో మహోగ్రభావజాల సౌందర్యరేఖలు పెనఁగొనంగ వింతగ విరాజిల్లుచున్నదే. ఇది యిట్టిదని నిర్ణయింప నాకగాదు సురాసురుల కైనం దరమా? వదన నాసా శ్రుతి నయనాదులనుండి చిటపటారభ టులతో మింటిదనంటు మంటలు గుప్పుగుప్పున వెడలుచుండఁ దచ్ఛరీ రావిర్భూతద్యుతిచ్ఛటలలో శంఖచక్ర గదాద్యాయుధహస్తులై హృషీకేశులెల్ల యెడలఁ గనఁబడుచుండిరే. ఏతద్భూతహస్తముల శూల, భల్ల, భిండివాల, కరవాల ముసల, ముద్గర, పరశుప్రభృత్యా యుధములు తళతళ మెఱయుచున్నవి. ఏమి యీ యుగ్రరూపము ఇది యిచ్చటికేల వచ్చినది? కానిమ్ము. త్రిజగమ్ములొక్కటై రానిమ్ము. ఒక్కండనయ్యు ధైర్యమ్మును జిక్కఁబట్టి ధనుస్సు నెక్కుపెట్టెద. నిప్పులుగ్రక్కు శరపరంపరల గుప్పిచప్పున నుప్పరం బున కెగిరిపోఁజేసెద. కాదేని హతమార్చెద. (బాణము విడిచి) ఔరా! భీతిలేని ఈభూతము ప్రదర్శించు సామర్థ్యము వర్ణనాతీతము. ఔర్వము జలధిజలంబులఁ ద్రావినట్లు మత్తూణీర నారాచంబుల నెల్ల నుల్లాసంబుగ మ్రింగినదే. దివ్యశక్తియుక్తమగు శక్తిం బ్రయో గించెద. ఇది లయసమయరుద్రుని ఫాలలోచనాగ్నిజ్వాలవలె ఈ పెనుభూతమును భస్మము చేయుఁగాక! (ప్రయోగించి) ప్రళయకాల ధగద్ధగాయమాన భానుమండలపతితోల్కాభంగి నిదియు నల్పాల్ప శకలములై నిస్తేజమై నిరర్థకమైనదే (విచారముతోఁ) ప్రవహించు నది కడ్డుపడిన పర్వతమువలెనిల్చిన దీని నెట్లు తొలఁగింపఁగలను?

ఇది పాటయిూక నాయాటయెట్లు సాగును? ఆకసమున నెటుచూచినను విష్ణురూపములు దృగ్గోచరమగుచున్నవి. మానవ మానసాతీత, మాయామహిమఁ గనఁబఱచుచున్న యీభూతమును జయించిగదా నే శిబిరమునఁ బ్రవేశింపవలయు. ఇట్టి బెట్టిదపు దయ్యంబు నా సాహస ప్రవాహమునకుఁ బెట్టనికట్టయై నిట్టనిల్వున నిల్చియుండ నే నెట్లు నెట్టుకొనిపోఁగలను? పోఁజాలక నే నెట్లుమగిడి చనఁగలను? (తల పంకించి) నా మేనమామ కృపాచార్యుఁడు నాపైఁగృపచేఁ జేసిన హితోపదేశమును వినక, దుష్కృత్యమునకు వచ్చినందులకు నా కిది తీరని పరాభవముగఁ బరిణమించునా? మానవశక్తికి మించి నప్పుడు దైవశక్తిచేఁగదా సాధింపవలయు. కావున నిత్తఱి నాకుఁ గర్తవ్యమెద్ది? సకలదేవతాస్వరూపుండై సమస్త దైవికవిపత్తరిక్షణ ములో జాతమొనర్చు సర్వజ్ఞుఁ బశుపతిని ప్రమథాధినాథుని బ్రార్థించి కీడుదొలఁగించుకొని కృతార్థుండనగుదు. అంబికా మనో హరుఁబురహరుఁగిల్బిషదూరు హరు మనసార వేఁడుకొనియాత్మోపహార మర్పించువాఁడ ఆ భూతేశుఁడెట్టి గతి కల్పించిననను భవించువాఁడ. నాకీ ప్రతిబంధకము తొలఁగెనేని శివు ననేక భూతోపహారంబులఁ దృప్తుంజేసెద (ఎదుటఁజూచి) అరెరే! యెంతవింత? కన, దనల పరివృత కనకవేదిక యిట కేల వచ్చినది? అదిగో! బహువిధ చిత్ర వస్త్ర నవరత్న కాంచనాహిశల్యక పాలమాలాభరణములతో నిస్తుల సమస్త శస్త్రాస్త్ర శోభితహస్తములతోఁ భీకరాకారములతో, దివ్య స్త్రవ్యాలగు ప్రమథులుగ్రదృష్టులతో నన్నుఁ దిలకించుచున్నవారు. ఇంతమాత్రమునకే నేను వెనుకంజవేయను. ఆత్మబలిదానమున కైన నాయత్తమగుదును గాని నా సంకల్పసిద్ధికానిది గృహోన్ముఖుఁడ కాను. ఇప్పుడు మనసార మృత్యుంజయుని స్మరించి యగ్ని జ్వాలా మధ్యంబున వెలుఁగుచున్న వేధికపైకి దూఁకెద.

అశ్వత్థామ

దండకము

శ్రీమన్మహాదేవ దేవాదిదేవా భవా పార్వతీవల్లభా భక్తసం రక్షకా నిత్యసత్యస్వరూపా కృపాసాగరా ధీరగంగాధరా వీరవిశ్వేశ్వరా నాగహారా సదాచార సర్వేశ్వరా శంకరా పాపదూరా హరా శావరాకారా పరేశా గిరీశా మహేశా సురేశా ప్రమథ్వాస కైలాసవాసా శివా లోకజాలంబు సృష్టింపఁ బోషింపఁ ద్రుంపంగ శక్తుండవీవే కదా రాజమౌళీ కపాలీ త్రిశూలీ సదా నీదుపాదారవిందంబులం గొల్తుఁ గష్టంబులం బాపి సౌఖ్యంబులం గూర్చి సంతృప్తి గల్గింపరావే జయంబీవె లోకాధినాథా పినాకీ కపర్దీ నమస్తే నమస్తేనమః.

(కనులు మూసికొని తలవంచి క్షణములోఁ గనులు తెఱచి శిరమెత్తిచూచి సంతోషముతో) ఆహా! యేమి నా భాగ్యము అదుగో పరమశివుఁడు ప్రసన్నమూర్తి కరుణాకటాక్ష వీక్షణమ్ముల నాపైఁ బ్రదర్శింపఁ జేయుచున్నాఁడు. నా పుణ్యము ఫలించినది. నా జన్మము ధన్యము. ఈ మహాదేవుని మఱియొకసారి సంస్తుతించెద. (వేదిక దిగి వినయముతో మోకరిల్లి) శంకరా! భక్తవశంకరా! భవద్వరప్రసాదంబున జన్మించిన వాఁడనని నన్ను పలువురు వాకొనుచుండ్రు. త్వదీయ పాదారవిందములకివియే వందనశతంబులు. నీ యనుగ్రహమునకుఁ బాత్రుండనైన నేనిక శాత్రవుల నిగ్రహింప వరము ప్రసాదింపుము దేవదేవా దివ్యప్రభావా! (పైనుండి ఖడ్గముపచ్చును. దానిని కేసికొని కనుల కద్దుకొని నమస్కరించుండ శివుఁడదృశ్యుఁడగును) అనన్యసామాన్యమైన ఖడ్గము నొసంగితివా! కృతార్థుఁడను. ఈ రేయి యీ దివ్యాయుధ సాహాయ్యమ్మున శత్రుసంహార క్రియా వినోదుండనై వీర విహారమ్ముసల్పి విజయకేళీలోలుండనయ్యెద.

[ నిష్క్రమించును ]